# సరసరసాయనము

(ప్రథమభాగము.)

---

మం - వేంకటశర్మగారిచే

రచితము.



శ్రీనికేతనముద్రాక్షరశాల

చన్నపట్టణాము.

1913.

 వెల నాలుగు అణాలు.

# పీఠిక.

ఈచిన్నిపొత్తమునకుఁ బీఠిక వ్రాయవలసినదని నామిత్రులు వేంకటశర్మగారు నన్ను నియోగించి యున్నారు. విపులముగ వ్రాయుటకు సమయము చాలమి సంక్షిప్తముగ నామనోగత విషయముల విలిఖింప శర్మగారియుఁ జదువరులయు ననుమతిఁ బ్రార్థించుచున్నాఁడను.

భారతవర్షంబునం దెల్లెడలంబలె ఆంధ్రదేశంబునను నూతనయుగమొందు ప్రారంభమయియుండుట కాలచిహ్నముల నెఱుంగఁగలవారెల్లరకును విదితము. ఈనూతనయుగము పాశ్చాత్యనాగరికపుఁ బ్రాబల్యముచేనుద్దీపితము. లోకపరమావధి చింతనముచే నధిష్ఠితము. ప్రకృతిప్రేమా ప్రవాహముచే నార్ద్రీకృతము.

ఇట్టియుగమున నెట్టిమేటికవులయినను నుద్భవింప నెడముగలదు. నిశ్చలభక్తిమై భాషాసేవాపరులై మృదులముగ మధురముగ సుబోధకముగ వ్రాయంగల కవులాంధ్రిమున నీనూతనయుగవాసు లిప్పటికే కొందఱు కానవచ్చుచున్నారు. వారిలో మామిత్రులు

శర్మగారొక్కరు ప్రథములు. వీరింబట్టెఁ బ్రబలి వికాసమునంది కీర్తిగాంచుచుండు నిప్పటి ఒకరిద్దఱి కును ముందురానున్న ఇట్టివారలకును శర్మగారే ఈ నూతనయుగమున మార్గదర్శకులనుటకు సందియము లేదు. వీరి పద్యరచన స్వాభావికంబై హృద్యంబై పాశ్చాత్యప్రసిద్ధకవులం దలపించుచుండును. విపుల గ్రంథములకన్న హ్రస్వపద్యావళులే యొక్కొకటి మనస్సున కాహ్లాదమొసంగుచుండునుగాన నీగ్రంథ రత్న మెంతయు సమ్మోదావహంబౌ. అదియునుంగాక నియ్యది విపులగ్రంథావలోకనాశక్తిలేని బాలుం కును, బాలికలకును నుత్తమజ్ఞానప్రదాయకంబగు ననుటకు నిందలి విషయములే సాక్షులు.

ఈపద్యావళులలో ౧౪-వ పుటయందు ప్రచురిం చిన 'కోకిల' పద్యములు కవిని గొంతవఱకు చిత్రింపఁ గలవని నాయభిప్రాయము.

ఆంధ్రలోకంబెల్లయీయుఁగవికిఁ దగిన ప్రోత్సాహం బిడెడుగాత.

ఇట్లు,

బుధవిధేయుఁడు,

గా. హరిసర్వోత్తమరావు.

# సరసరసాయనము.

(ప్రథమభాగము.)

## జన్మభూమి *

### మంజరీద్విపద.

చరణంబు లెచ్చోటఁ జరియించుచున్న
హృదయ మించుకయేని నెడలింప లేని
యైంద్రజాలికబంధ మది యేదొ యొకటి
మన జన్మభూమికి మనకును గలదు
సృష్టినద్ది నిరక్షరేఖయందున్న
ధ్రువ మండలంబునందున నొప్పుచున్న
మనసు నాకర్షించి మగ్నమ్ముఁ జేయు
నట్టి యయస్కాంత మందులోఁ గలదు.
అది స్వతంత్రునిచేత ననవరతంబుఁ
బ్రేమింపఁబడుచుండు హృదయంబునందు
బహుకష్టజీవియై బ్రతుకుచునుండు

* 'ఇలైజాకుక్' అను నామె "నాజన్మభూమి" యనుదాని యనుసరణము.

బానిసచేఁ గూడ భావింపఁబడును.
భీరువుచేనైనఁ బ్రేమింపఁ బడును
మఱియు ధీరుండైన మానవుచేత
నధికానురాగత నరయంగఁబడును.
ఈవసుమతిలోన నెవ్వానినైన
నెదకిష్టమగుభూమి యేదని యడుగు
మాతండు వెంటనే యది జన్మభూమి
యని యుత్తరం బిచ్చు నతిగర్వమునను.
ఈ వసుంధరయందు నెవ్వానినైన
మహి నేప్రదేశంబు మనసార నీవు
ప్రేమింతువని ప్రశ్న వేసెదవేని
మాతృభూమినె మూడు మార్లకునేను
నెలమి దళ్కొత్తఁ బ్రేమించెదననుచు
నపుడె ప్రత్యుత్తరం బతఁడిచ్చు నీకు.
భారతదేశమా ! బహుదూరమందు
నెగడుచు భూమిలోనికిఁ జొచ్చియుండు
చక్కని పరదేశ సాగరతీర
ములకన్న నుపయోగమును జాలకున్న
నీతీరములె వర్ణనీయముల్ నాకు.

నీభూములందు వర్తిత లీల నెసఁగు
పచ్చికతోఁ గాని బహురమ్యమైన
నీశరత్కాల చంద్రికలతోఁ గాని
యే మానికంబైన నీడు రాఁగలదె ?
యే మౌక్తికంబైన నీడు రాఁగలదె ?
వేని సువాసనల్ వేనికాంతులును
దమచుట్టు స్వర్గంబుఁ దనరింపఁజాలు
నట్టిపూవులతోడ నలరారునట్టి
తావులఁగూర్చి స్తోత్రములు సేయుదురు
కాని మామక జన్మకారణమైన
పుడమిపైఁ బుట్టెడు పువ్వులకన్నఁ
గాంతిమంతంబులై కనులకింపగుచు
ఘనసౌరభములచే ఘ్రాణంబుఁదనిపి
కదుమించు విరులను గాన జగాన.
కలకంఠ కలకంఠ కలితగానముల
శుక శారికాది మంజుల నినాదముల
మదిఁ గరంచెడి నెలమావుల నలరు
భూములకైనవచ్చు పుణ్యభూములను
క్షితిఁ జూడఁగలనె యే సీమలనైన?

అహాహా! నేత్రోత్సవం బతిశయిల్లంగ
నీ మయూర విహంగ నృత్యంబులెల్ల
ఘనఘనోదయమునఁ గానంగ నెంచి
యతిమోదమున వేచి యాప్యాయ మొదవఁ
జూచి భావమునందుఁ జొక్కెడు పొలుపుఁ
బడయంగ వచ్చునే పరదేశమందు?
కలరవంబులతోడఁ గలశవావళులు
గగనంబునకుఁ గౌతుకము మీర నెగసి
చిరుగజ్జియలధ్వనుల్ చెలువు రాణింప
వింత మొగ్గలు వేయు విధము నీక్షింపఁ
గర మొప్పు నంతరంగమునఁ జనించు
వేడుక కలనైన విస్మృతిఁ గనునె?
హాయిఁ గూర్చెడు సీమ లవి యెన్ని గనిన
నవరత్నమయ సదనము లెన్ని గనినఁ
దప్తకాంచన నికేతనములు గనిన
నానందమయ్యెనా? మదీయాత్మ-
ఇంద్రభోగ మనుభవించుచు నున్న
నత్యంత సౌఖ్యంబులందుచు నున్న
నాయంత రంగంబునను జన్మభూమి

స్మరణను మఱచిపోఁ జాలితినొక్కొ ?
నా మాతృదేశమా ! నాప్రాణ పదమ !
నా నాకలోకమా ! నాతపః ఫలమ !
నాప్రేమధన నిధానంబులై వెలయు
వెలలేని సద్వస్తు వితతులకన్న
రహినాదు భాగ్య సర్వస్వంబు కన్న
నాప్రాణములకన్న నామేనికన్న.
నతి గాఢముగ నిన్ను నాత్మ ప్రేమింతు.
చెలఁగి నేను విదేశ సీమల యందు
బహు సుందరోద్యాన వనములయందుఁ
దీర్ఘైన కాసార తీరమ్ములందు
స్వర్ణ నిర్మిత దివ్య సౌధమ్ములందు
చెలువు రాజించు పచ్చిక పట్టులందు
సరిలేని పూర్ణిమా చంద్రికలందు
విహరించుచున్నను వేవేగముగను
నాజన్మ భూమికి నన్నుగొంపోవు.
వాయువునకు నేను స్వాగతం బిడుదు.
నాస్వదేశమ ! సదానంద దాయకమ !
నాపుణ్యపుంజమా ! నామనోరథమ !

నిత్యంబు సత్యంబు నిన్నె ప్రేమింతు
నిను గౌరవించెద నిన్నె పూజింతు
నిను మది భావింతు నిన్నె సేవింతు
నేను ముమ్మాటికి నిన్నె ప్రేమింతు.
ఎలమి నీయందె నా హృదయ యంత్రంబు
నిశ్శబ్ద లీనమై నిల్చెడుంగాక !
నిర్మలంబై నట్టి నీభూమియందె
నాస్మశానంబు చెన్నారెడుం గాక !
పావన నదులచే భాగ్యదం బగుచుం
బొలుపారు నీపుణ్య భూమినే మామ
కాస్థికల్ విశ్రాంతి నందెడుంగాక !



## దేశభక్తి.

క. జననియును జన్మభూమియు
ఘనమగు స్వర్గమున కన్న గౌరవ నీయల్
జనయిత్రిని జన్మస్థల
మునుభక్తి భజింపకున్న మోక్షము గలదే?
ఆ. సకలదేహములకు జనన కారణములై
తనరు శుక్లశోణితంబులకును

దనువు వృద్ధినొంది తనరారుటకు హేతు
వైన యన్న మిదుసన సహజము గాదె?

తే. తల్లులకు నెల్లఁ దల్లినాఁ జెల్లు నీక
తమ్మునను దేశమాత; యాధర్మ మెఱిఁగి
తల్లి పిల్లలు భక్తి తాత్పర్యయుక్తిఁ
దేశమాతను సేవింపఁ దగలయు.

తే. ధాత్రియను పేరు తనకు సార్థకముగాఁగ
సర్వకాలంబుఁ దన యుత్సంగమునందె
మోచిప్రాణుల నెల్లను—ఎ ప్రోచు
జన్మభూమి భజింపనిజనుండు జనుఁడె?

తే. మాతయనియెడు సద్భక్తిచేతనైన
బూజ్యరాలనియెడు సుబుద్ధినైన
సకల ఫలదాత్రియను కృతజ్ఞతనునైన
జన్మభూమిని భజియింపఁజను జనుండు.



# మానవసేవ.

## గీతము.

వస్తుజాలంబు నందెల్ల వైద్యుతాగ్ని
యిమిడియున్నట్టు సకల భూతములయందు
నీశుఁ డంతర్గతుండౌచు నెసఁగుఁగాన
నఖిలమానవసేవ సేయ్యంగ వలయు.
ఈశ్వరుఁడు సర్వజనుల సృజించుకతనఁ
దండ్రియగుఁగాన నరులు సోదరులుగాన
నన్నదమ్ములసేవ యర్హమ్ముగాన
నఖిల మానవసేవ సేయంగవలయు.
మానవులసేవయే దేశమాతృ సేవ
దేశసేవయె సకల లోకేశసేవ
కావునను దేశభక్తులు దైవభక్తు
లఖిల మానవసేవ సేయంగవలయు.
మనుజులన్యోన్య సాహాయ్యమునను వృద్ధి
నందుటయె యీశ్వరునకుఁ బ్రియంబుగాన
దైవ శాసనమును దీర్పఁదలఁతు మేని
యఖిల మానవసేవ సేయంగవలయు.
ప్రజలసేవయె తనసేవవలెఁ దలంచి

యీశ్వరుఁడు చాలఁదృప్తి వహించుఁగాన
నీశ్వరుని సేవసేయ వాంఛించు మర్త్యు
లఖిలమానవసేవ సేయంగవలయు.

ప్రజల శుశ్రూషకై శరీరము నిరంత
రమును వినియోగపఱచు స్వార్థరహితుండ
ధన్యతముఁ డగుఁగాన నుత్తమ జనంబు
లఖిల మానవసేవ సేయంగవలయు.

పామరులయందు గొప్పవిద్వాంసులందు
ధనికులందును నిరుపేద మనుజులందు
నార్త జనులందు సమబుద్ధి నలరఁజేసి
యఖిల మానవసేవ సేయంగవలయు.

సత్రములపాఠశాలలస్థాపనంబో
ఔషధాలయనిర్మాణపోషణములో
శక్తికిందగునుపయుక్తసరణిఁదీర్చి
నఖిల మానవసేవ సేయంగవలయు.

ఆర్తజనులకు శరణాల యమ్ముల నిల్పి
రోగులకు నౌషధము లిచ్చి బాగుచేసి
వృత్తిలేనట్టి జనులకు వృత్తిఁగూర్చి
యఖిల మానవసేవ సేయంగవలయు.

"ఆత్మవత్సర్వ భూతాని" యనెడు సూక్తి
మఱవకెల్లరఁ దనభంగి నఽసికొనుచు
జీవయాత్రను జేయుచుఁ బావనగతి
నఖిల మానవసేవ సేయంగవలయు.

ధరఁ "బరోపకారార్థ మిదంశరీర"
మనెడు నార్యోక్తిఁ దలచి, సమస్తగతులఁ
బరుల కుపకారకములైన పనులొనర్చి
యఖిల మానవసేవ సేయంగవలయు.

నెమ్మిఁ "బాపాయ పరపీడన" మ్మటంచు
నమ్మి తనవల్ల సుంతైన నరులకెపుడు
బాధఁగలుగంగ నీయక సాధురీతి
నఖిల మానవసేవ సేయంగవలయు.

మనుజసేవయె యీశ సేవనముగాన
నీశుసేవించి ప్రతిఫలం బాశపడఁగ
రాదు గావున నిష్కామ రమ్య భక్తి
నఖిల మానవసేవ సేయంగవలయు.

మనకు విధియించినట్టి ధర్మంబు నందె
కలదు మానవసేవయుఁ గాన విధిగ
మన స్వధర్మం బనుష్ఠించు మార్గమునను
నైన మానవసేవ సేయంగవలయు.



## కవి : కాంచనము.

**కవి:—**

గీ॥ సరసతను మించి యతి మనోహరతఁగాంచి
సర్వసుమన సామోదత సంతరించి
సుకవివర్ణన కెక్కిన సుకృతి వీవు
కలకనందేల ? చంపక కలిక ! చెప్పుము !

గీ॥ కర్ణయుగమందు శిరమందుఁ గంఠమందుఁ
గరకమలమందు సుశయనోత్కరములందుఁ
గరమునను రక్తిఁ బ్రజలెల్ల గారవించు
నీదు మహిమాతిశయము వర్ణింపఁదరమె ?

గీ॥ రాజరాజ శిరస్థ చిరత్నరత్న
రాజిత కిరీటమున, రాజరాజసేవ్య
రాజమాళి సుమాళిసరస, నటించు
నీదు పూజ్యత గణుతింపఁగాఁ దరంబె ?

**కాంచనము:—**

ఆ॥ సదయహృదయ ! నాదుసంతాప హేతువు
విశదముగను విన్నవింతు వినుము
వివిధ పుష్పరతుల విహరించు రసికుండు
మధుకరుండు నన్ను మఱచినాఁడు.

గీ॥ ఉదుటుగలచేవఁ దొలువంగ నులినిమించు
పదునుగల మోము మిక్కిలి మృదువులయిన
పుష్పములమీఁదఁ గోమలస్ఫూర్తిఁ జేయు
వానినేరుపుఁ గొనియాడ నౌనె? మనకు.

గీ॥ వినెడు వారల వీనుల విందొనర్చి
చేతముఁ గరంచు సరస సంగీతకలనఁ
గుసుమ జాతులనెల్లఁ గైవస మొనర్చి
యెపుడు రమియించు తద్భాగ్య మెన్న వశమె?

గీ॥ పాటలను బాడి మెప్పించి పద్మినులను
వారు ప్రియ పూర్వముగ నిచ్చు పూరసమున
జీవ యాత్రను హాయిగాఁ జేయుఁగాని
యొరులఁ బీడింపఁడూరకే యుదరమునకు.

గీ॥ అతని చెలిమి లభింపక సతత మిట్లు
చిత్త సంతృప్తిలేక నేఁ జింతి లెదను
సొగసులెన్నున్న మనసున సుఖములేమి
కానఁ గాచిన వెన్నెల గాదె? బ్రదుకు.

కవి:—

గీ॥ చాల బేలవుసుమి। నీవు చంపకంబ!
నీదు ప్రఖ్యాతి యేమి? నీనీతి యేమి?

పూత చారిత్రమేమి? నీజాతి యేమి?
క్రూరపు మశ్చాదు పల్కుమిం గోపమేమి ?

గీ॥ అధిక చంచలుండు మధుపాన మత్తుండు
మలిన మూర్తి బహుళ మార్గవర్తి
ఇట్టి వానివలచి యిస్సిరో! నీకీర్తి
నలుపుఁజేసి కొనఁగఁ దలఁచెదేల ?

గీ॥ అదయతను దాల్చి యుచితంబు ననుచితంబుఁ
బుణ్యమును బాపమును నెంచఁబోక విరహి
జనుల నేచెదు మదునికి సాయపడెదు
చెనఁటి చండాలులనుగోరఁ జనునె? యకట?

గీ॥ పద్మినిని బాయనని మున్ను బాసచేసి
పగలు రమియించు రేయినిఁ దొగలఁజేరి
యెప్పుడు విడనాడనంచు నమ్మించి మరల
దానిఁ గూడు భుజంగ వర్తనుఁడతండు.

గీ॥ తుమ్మెద నటంచు నవశకు నమ్ముగాగఁ
జెవులు చిల్లులువడ రొదఁజేయు చెవుడు
మనసు విసిగించు నిటువంటి మడ్డివాని
నేమనుచు వరియించితి? నీవు చెప్పుము !

గీ॥ తల్లి నెడఁ బాపి బిడ్డలఁ దస్కరించి
తెచ్చి బలుమంత్ర తంత్ర యుక్తిని భ్రమింపఁ
జేసి తనజాతిగా మార్చు దోసకాడు
ధూర్తు మటు మాయకాఁడు మధువ్రతుండు.

గీ॥ తుచ్ఛమగు వాని సంగతిఁ ద్రోసి పుచ్చి
శాశ్వతా నంద వరుఁడైన శంకరుని ప
దార్చనం బబ్బుటయె ధన్యమనుచుఁ దెలిసి
కొనుమ! భజియించిమనుము! కాంచనము! వినుమ!



కోకిల.

క॥ ఏకాకి వీ వనంబునఁ
గోకిలమా! కొసరి కొసరి కూసెదవు సుమీ!
నీ కలకంఠము నోర్వని
కాకులు కడు నిర్దయములు కలహప్రియముల్.

ఆ. ఎన్ని దినము లిట్టు లేకాకి మూకలో
మునులరీతి మౌనమును వహించి
ముద మొకింత లేక బ్రదుకుదు విస్సిరో!
యనుచు రోయఁబోకు మా! పికంబ!

గీ॥ కన్నతల్లియె నీయందుఁ గరుణ మాలి
పుట్టినప్పుడె పొరుగింటఁ బెట్టి పోయె
కొన్నినాళ్లకె నినుఁబెంచుకొన్న తల్లి
యిల్లు వెడలించె. దురదృష్టమేమొ? పికమ!

ఆ॥ కాకు లెల్ల నీకు గర్భశత్రువులౌట
కెన్న నీ స్వరంబె హేతువు కద!
గుణమె దుర్గుణంబగును గాదె? కాల వి
పర్యయంబునందుఁ బరభృతంబ!

ఆ॥ కాకి యొగ్గులేమి కావించె? బ్రహ్మకు
నీవు లగ్గులేమి నెరపినావు?
దాని కంఠ మట్లు దగ్ధంబుఁజేసి నీ
కెట్లు శ్రావ్య కంఠ మిచ్చె? పికమ!

క॥ రూపు లొకటి చేసిన వా
ణీపతి వేఱుగ సృజించునే? స్వరములు త
త్పాప మటు బ్రద్దలయ్యెను;
నీపుణ్యం బిట్లు పండె; నిక్కము పికమా!

క॥ గాత్రము లొక రీతినె శ్రీ
పుత్రుఁడు నిర్మించి నీదు పుణ్యఫలముననర్

గాత్రములు వేఱు పఱచెను
చిత్రముకద! సృష్టి కర్తచెయ్వులు పికమా!

గీ॥ చివురులను గూర్చి ప్రీతిఁ బోషించి నట్టి
స్వామి యరిగిన యవల హార్షంబుఁ దక్క
వగపునను స్రుక్కి మెలుగె త్తి పలుక వహహా!
నిజము విశ్వాస మన్నను నీదె! పికమ!

గీ॥ పదుగురికి నింపు వుట్టఁగాఁ బలుకనేర్తు;
మోదులును జగురింపఁగాఁ బాడ నేర్తు;
పులుగు లందెల్ల మేటివై చెలఁగు దార!
పక్షివైన నీజన్మంబు పావనంబు.

గీ॥ పల్లవంబులనే కాని భక్షణంబు
సలుపనొల్లవు; మాధవస్వామిఁగాని
పాడనొల్లవు; ఆత్మ భూప్రభునిఁగాని
కొలువనొల్లవు, సుకృతివే, కోకిలంబ.

గీ॥ నిరతము వనంబులనె కాని నిలువఁ బోవు;
ఎల్లఘునతరులను నాశ్రయింపఁ బోవు;
తివిరి సన్మార్గమును దప్పి తిరుగఁ బోవు;
నీదు సద్వర్తనము మేలు కాదె? పికమ;

గీ॥ మేటి ద్విజకుల మందు జన్మించినావు;
పరమహంసల స్నేహంబుఁ బడసి నావు;
శుక సుసంగతి నిత్యంబుఁ జూచినావు;
మేలు ; కోయిల ; నీజన్మమే తరించె.

ఆ॥ చిలుక చక్కఁదిని పలుకుఁ జెప్పినరీతి
కోకిలంబ ! చివుళ్ళుటాకు మెసవి
రహినిఁబంచ మస్వరమునఁ బాడెద వీవు ;
తిండికారణంబె ? తెలివికాక.

గీ॥ మునుపు కొన్నాళ్లు పలుగాకి మూఁకఁ జేరి
బ్రతికితి నటంచు వగచెదు కతన నేమొ ?
కోవెలా! కన్నులారీతిఁ జేవురించె;
మానధనుఁడోర్చునే ? యవమానలవము.

గీ॥ ఎంతకాలంబు నీచులయింట నున్న
నకట ! పరపుష్టమన్న పేరొకటిఁదక్క
నవగుణం బబ్బలేదిది యబ్బురంబు
నీసుశీలత శ్లాఘ్యంబు నీడజంబ!

గీ॥ కాకులకు నీకు నాకార మేకమగుట
లోకు లెఱుగంగలే రనుకోకు సుమ్మ!

కంఠమాధుర్యమే శతగతులఁ దెచ్చు
సారతర కీర్తిఁ గలకంఠ శాబకంబ!

---

## ధారాధరము.

ఆ॥ నింగిపై సదా మెలంగెడు నీకును
నేలపై నటించు నెమలులకును
నేస్తమేమొ? నీదు నేర్పేమొ ? నినుజూచి
గేరి యాడు నెమ్మి వారిధరమ !

ఆ॥ తనువులెంత దూరమున వర్తిలుచునున్న
మనసు లొక్కచోట మసలునేని ?
స్నేహధర్మ మెపుడుఁ జెడదన్నసీతికి
మీదు చెలిమి సాక్షికాదె ? జలద !

గీ॥ అప్పు లిడ జాలు రత్నాకరాదు లుండ
విడచి సారంగములు నిన్ను వేఁడు చుంట
నీమహోన్నతిఁ దిలకించి నీదు ఘనతఁ
గాంచి సరసత్వమును జూచికాదె ? జలద!

ఆ॥ అహహా! నీదు స్నేహ మహిమాతిశయమేమొ
చాతకంబు నీవొసంగునట్టి

జలకణంబులాని సంతుష్టిఁగని నిన్ను
నిరత మాశ్రయించు నీరధరమ !

ఆ॥ అమృతమో? విషంబొ? యదినేనెఱుఁగఁగాని
నీవొసంగు రసముఁ ద్రావు వెనుక ;
నితర వస్తువేది యిందక చాతకం
బుపవసించు నిరతమోపయోద !

ఆ॥ సరస గుణముఁగలిగి సతతాశ్రిత కదంబ
కావనుండ వగుచుఁ బావనుండ
వైన నీదుఘనత నభినుతింప వశంబ
గునె? పయోద ! దానగుణ వినోద !

తే॥ ఇంద్రునకు వాహనంబవై యెసఁగినావు
చంద్రసూర్యుల నెదిరింపఁ జాలినావు
మిన్ను ముట్టిన యున్నతి మెరసినావు
నీవు సామాన్యుఁడవు కావు! నీరదంబ !

ఆ॥ లక్ష్మితోఁడ మెఱసి లలిమీఱ హరిఁబోలె
మెఱుముతోఁడఁగూడి మెఱయు నీదు
సొంపు పెంపు నింపుఁ జూచి సంతోషింప
వలెను గాని చెప్పవశమె ! శరద

ఆ॥ విశ్వమునకు నెల్ల వెలుఁగును దయసేసి
సుఖముఁ గలుగఁజేయు సూర్యునకును
వెలుఁగుఁ గూర్తువంట ! వింతయా నీశక్తి
వశమె ! ప్రస్తుతింప వారి వాహ !

తే॥ నీదయావృష్టిచేత నే కాదె ! భూమి
సర్వ సస్యాఢ్యమై యొప్పి సకలభూత
జీవనాధారమగుచు మోదావహంబు
నగుచు వర్థిల్లు వారి వాహావతంస !

తే. భీష్మమైనట్టి గ్రీష్మకాలోష్మమునను
బోలి తూలెడు నీజంతు జాలమునకుఁ
జల్లఁదనమును సౌఖ్యంబు సంతసంబుఁ
గూర్చు పుణ్యాత్ములెవరు ? నీకొలఁది జలద !

తే॥ ఏఱులై పాఱె నీదాన ధారలెల్లఁ
జూడఁ జూడంగ నీయిల్లు శూన్యమయ్యె;
నొడలు గుల్లయ్యె! నప్పుల బడలనయ్యె!
లేదనెడు మాట నీయొద్ద లేదు జలద !

ఆ॥ నీదు గర్జ గర్భ నిర్భేదమును జేయు
వ్రాలఁజేయు గుండె వ్రీలఁజేయు

ఘనతరంబు నీదు గాంభీర్యము కరంబు
ఘనుఁడ వగుదు వీవు గగనసదన !

ఆ॥ సర్వకార్యములకు సాధనకారివై
యఖిల దిశల బ్రహ్మ మట్లనిండి
భృత్యులట్ల యుపచరించును జనులకా
మించు నీవలన జనించు జలద !

ఆ॥ తివిరి యప్పులెన్ని తెచ్చినఁ ద్వరగనీ
విచ్చుకతనఁ గాదె ! మెచ్చి మరల
రహిఁ నొసఁగు చంద్రు రత్నాకరాదులు
పరపతి యననదె ! వరపయోద !

క॥ మానుగఁ బరోప కృతికై
మేనెత్తం బోలు ! మేలు ! మేలు ! బళీ ! నీ
దే నిజము, ధన్య జన్మము
దాన గుణా ధారమా ! సుధారాధరమా !

తే॥ కవచకుండలా లిచ్చిన కర్ణు కన్న
వెన్నెముకనిచ్చిన దధీచికన్న మేని
కండలిచ్చిన యాశిబికన్న నీవె
ఘనుఁడవనియే మొ? ఘనుఁడంద్రుని నుఁబయోద.

క॥ నీవుపకారము సేయం
బోవంగఁ జెలుచుఁ బ్రభంజనుఁడు దాతకడ
గావలులుచేరి యిచ్చెడు
నీవులఁ జెలుచుటగి నైజషేకద ! జలదా !

ఆ॥ ఎండ నడచువానికే చెట్టుఁ జేమయు
లేని చోట నీవు భాను నడుసు
నడ్డమగుచుఁ గాచి యాదరింపకయున్న
నొండు దిక్కుఁగలదె ? యోపయోద !

క॥ కౌతుకమున షడ్జస్వర
గీతములను బాడి యూడికీర్తించెడుకే
కీతతులఁ జూచి పొంగెడు
నాతతమగు భాగ్యమెవరి కబ్బు ? పయోదా !

క॥ మృగములవలె ఖగములవలె
నగములవలెఁ జిత్రగతుల నానాగతుల
గగనమను నాటతెరపై
నగపడి జగములరఁజేతు వహాహపయోదా !

తే॥ పెద్దరూపంబు తోడఁ గన్పించి చూచు
చుండ నణురూపమగుదు వఖండమైన

యట్టి బ్రహ్మాండ మెల్ల నాయట్లఁబున్న
రూపముల రాశియని తెల్పురూపొ ? జలద !

క॥ ఒక మారు ధవళిమయు వే
ఱొక మారా రుణ్యమును మఱొక పర్యాయం
బిఁక నొక వర్ణముఁ దాల్తువు
సకలజ్ఞుండైన యైంద్ర జాలికుఁ బోలెన్.

---

## ఖద్యోతము.

ఆ॥ మినుకు మినుకు మనుచు మెఱయు నాతెక్కలు
కీటకములలోన మేఁటి ననుచు
గర్వపడెద వేల ? ఖద్యోతమా ! నీదు
మెఱపదెంత ? నీదు మేలిమెంత ?

గీ॥ ఉర్విజనులెల్ల నిన్ను ఖద్యోతమనుచుఁ
బిలుతురని విఱ్ఱవీగకు ! వెఱ్ఱిపురువ !
భువన హితకారియై జగత్పూజ్యుఁడైన
తరణి యతఁడేడ ? నీవేడ ? తలఁచికొనుము ?

గీ॥ పేరు లోకమైన మాత్రాన గౌరవంబు
కలుగునే ? నీచులకు నధికులకుఁ బోలె

అమృతమను పేరు విషమున కమరియున్న
దాని గౌరవమున్నదే ? దీని కేందు ?

గీ॥ ఇలను సామాన్య కీటకములకు లేని
రెక్కలున్నవి గానసే నెక్కువనుచు
మిన్ను మన్నునుఁగానక మిడిసి పడకు !
మెఱసినను రెక్కలున్నను బురుగు వసరె !

గీ॥ ద్యుమణితోఁ నీవు సుంత ఖద్యోత సామ్య
మందఁ గలిగినఁ దత్కీర్తి నందఁ గలవె !
తొండమును గల్గియుండిన దోమకూన
సామజము కాఁగలదె ? యెన్నిచందములను.

క॥ మణివలె మెఱయుటను నభో
మణివలెనే నన్నుఁ గీటమని యంద్రు సుధీ
మణులనుచు మురియకే మీ
కణు మాత్రము సామ్యమున్నదటె కీటకమా !

క॥ రెక్కలు గలవు గదా ! యని
ఱెక్కలతోఁ గలిసి మెలసి ఱెక్కల ద్రోవన్
జక్కఁగ మెఱసెద ననుచున్
మిక్కిలిగా మిడిసి పడకు! మిణుఁగురుఁబురుగా!

సీ॥ మిణుఁగురులఁ బోలె నించుక మెఱయుదనుచు
నందఱు మిణుంగురుం బురు వండ్రుగాని
తత్ప్రకాశత, తత్పవిత్రత, తదుష్ణ
తయుఁ, దదుపయోగమును రవంతయునుగలవె?

గీ॥ గబ్బిలము ఱెక్కలును బాళ్లుఁ గలుగు కతన
ఖగముల మృగంబులను గూడఁ గలయనట్లు
పురుగువును బుల్గువును గాక పోయితీవు
పక్షములతోడ నీకైన ఫలిత మిదియె.

గీ॥ నింగిపై నెక్కఁగడయైన నిలువఁ గలవా?
విడువ కొక్కక్షణంబైన వెలుఁగఁ గలవా?
రేలు ప్రజలకుఁ బ్రొద్దేర్పరింపఁ గలవె?
సాటి యెటు వత్తు వీవు నక్షత్రములకు.

గీ॥ చుక్కలను విస్ఫులింగాలఁ జూపి నిన్నుఁ
జూప దివిటీల క్రిందను దీపమనరె?
ఇంత మాత్ర మునకె యేలయ్యెగసి పడుచు
నుబ్బి తబ్బిబ్బు పడెదె? ఖద్యోత నామ!

గీ॥ నీవు నక్షత్రములఁ బోలె నిశ్చయముగ
మెఱయకున్నఁ జంచలయగు మెఱపువోలెఁ

గనులు మిఱుమిట్లు గొనునట్లు కాంతిఁజూపి
చేత మలరింపఁగలవె? ఖద్యోత నామ!

క॥ చుక్కలు మించును నిన్నా
చుక్కలఁ జంద్రుండు మించు సూర్యుండతనిన్
మిక్కిలి మించును తేజున
నిక్కము! ఖద్యోత! ఘనుఁడ నేనని యెపుడున్.

---

* బంగారు పిచ్చుక.

తే॥ చటకరాజమ! నీమేని చాయఁ జూచి
నరులు బంగారు పిచ్చుకన్నారటంచు
నేను తలఁపను జుమ్మి! నీ నేస్పుఁ జూచి
తగిన పేరనుకొని రంచుఁ దలఁతు నెపుడు.

తే॥ జననమైతివి పిచ్చుక జాతిలోన
వర్తిలుచు నుంటి వాజాతివారిఁ గలసి
యూర పిచ్చుక నీకాలిగోరునైన
బోలఁజాలునె! యెన్ని జన్మాలకైన.

---

* ఈ పద్యము లోక బంగారు పిచ్చుకచేఁ జేయఁబడిన వినోదముల కానందించి వ్రాయఁబడినవి.

తే॥ గ్రామములయందుఁ బిచ్చుకల్ కాపురంబు
సేయుచుండెఁగియు వానికి స్వేచ్ఛ లేమిఁ
దలఁచి యది రోసి సర్వస్వతంత్రబుద్ధిఁ
బొలములఁ వసింతు విడిసేలు! పుల్లుఁగుత్తేడ!

ఆ॥ నీదు సూక్ష్మబుద్ధి నీ చమత్కారంబుఁ
గన్న విన్న మానికంపు బిచ్చు
కన్నఁజాల దన్న నన్నన్న !బంగారు
పిచ్చుకన్న నేమి వింత? చెప్పుము!

తే॥ మనుజు లే దిక్కు వానలో మూకు ననెడు
కోర్కెమెయి నీవు కట్టెడు గూండ్లుచూచి
తొలుకరికి ముందె తెలిసికోఁ గలిగి మిగుల
సంతసింతురు నిను మెచ్చి చటకరాజ!

తే॥ మానవులలోన బహు బుద్ధిమంతులైన
నల్లఁగాలేని మాదిరి నబ్బురముగ
గూండ్లు నిర్మించు నీనేర్పుకొలఁదిఁ దెలియ
సమరశిల్పికి సందేహ మని తలంతు.

తే॥ త్రాటియేశలుఁ దడప లీతాకుఁజీలి
కలును జిరుగడ్డిపరకలుఁ గలయఁ గూర్చి

జిగిబిగి చెలంగ నీవల్లు సొగసుఁగులుకు
గూటి పోడిమి చాటు నీమేటి తనము.

తే॥ మేలి గృహములు మేడలు మిద్దెటిండ్లు
గాలి వానల కెవ్వడైనఁ గూలుఁ గాని
నేలకెత్తుగఁ జెట్లపైఁ గాలిలు నీదు
గూటికే భంగపాటు రాదేటి వింతొ?

తే॥ ఆఱుమూడు నెలల కొక్కమారు తిరుగ
వైచుచున్నను మా యిండ్లు వానఁ గురియు
గాని నీ యిల్లు సవరించి కట్టుకున్న
నీటి బొట్టైనఁ జొరదౌర! నీడ జంబ!

ఆ॥ నీదు బిడ్డలూఁగ నెఱి నుయ్యెలయుఁ బోలెఁ
గ్రీడలాడ మంచిమేడఁ బోలెఁ
గాపురంబు సేయఁగా మందిరముఁ బోలె
నలరు నీకులాయ మండజంబ!

తే॥ ఇరులఁ గడఁతేర్చి చాలవెల్తురులఁ జేర్చి
సుఖము నొడఁ గూర్చు రత్నదీపికలు గాఁగ
గూట మిణుఁగురుఁ బురుగులఁ గూర్చు నీదు
బుద్ధికుశలతఁ దలఁతు మోపులుఁగు మిన్న!

క॥ నినుఁ బెంచు వార లేవిరు
లను జూపినఁ జిటుక లోపలనె తెచ్చి ముదం
బానఁ గూర్చెద వేలిక కిఁకఁ
గొని యాడఁగఁదరమె! నీ సుగుణ గరిమ మహా!

ఆ॥ బంతిఁ నీకుఁజూపి బావిలోఁ బడవేయఁ
దోనఁ బోయి దాన్నిఁ దోడి తెచ్చి
పోషకునకు మోదమును గూర్చు నీకూర్మిఁ
పేర్మిఁ బొగడఁ దరమె! విహఁగ తిలక!

ఆ॥ విరు లొసంగి పంప వేవేగమునఁ బోయి
సరసురాలి కీలు జడను ముడిచి
వచ్చి దానిపతికిఁ బ్రమదంబుఁ గూర్చు నీ
జాణతనము నెన్నఁ జాల ఖగమ!

క॥ చాతుర్యముఁ గల శిల్పి వి
జ్యోతిష్కుఁడ వద్భుతైంద్ర జాలికుఁడవు, సు
స్వాతంత్ర్య రతుఁడ వహహా!
యే తెఱఁగున నిన్నుఁ బోలు నితర ఖగంబుల్.

ఆ॥ చిన్నపిట్ట యింత విన్నాణంపుం బనుల్
సేసె మనుజు లెంత లేసి పనులు

నెరపవచ్చు ననెడు నీతినిఁ దెలుప దే
వుఁడు నిన్నుఁ సృజింపఁ బోలు! ఖగమ!



తేన టీగ.

గీ॥ నిదుర లేచిన దాదిగా నీవు మరల
నిదుర నొందెడు నందాఁక, నిమిషమైన
విశ్రమింపక యాహార వితతి వెదకి
యార్జనము సేయు నోపిక నభినుతింతు.

గీ॥ అను దినముఁ బొట్ట నిండిన యంతతోనె
తృప్తినొందక తేనె నెంతేనిఁ గూర్చి
వానకారున శ్రమ రవంతైన లేక
సుఖము నొందెడు నిన్ను సంస్తుతి యొనర్తు.

గీ॥ ప్రాలుమాలి యొడల్వంచి పాటు పడక
యుదర పోషణకాహార మొదవదనుచు
శోకమొంది కృశించెడు సోమరులకు
నీదు గుణపాఠమే పఠనీయము గద!

క॥ కల వస్తువు లన్నియు వి
చ్చలవిడి వెచ్చించి ముప్పు సమయంబుఁ ద్రి

ప్పూలఁబడెడు పామరులు నీ
వలన బ్రతుకు దెరవుదెలియ వలెగద! సరఘా!

ఆ॥ అమృత సమములైన యలజుంటితేనియ
పుట్టతేనె చిన్నిపువ్వుతేనె
మొదలుగలవి ప్రజలకొదవు భాగ్యము నీవు
లేనినాఁడు గలదె? తేనెటీగ!

క॥ నీ పట్టుల వలననె కా
దా! పుట్టును మైన మది సదా మనుజులకు౯
జేపట్ట నుపకరించును
నీ పుట్టువు సార్థకంబు నిక్కము సరఘా!

---

## చూతము.

### గీతము.

చూత మని దాయవచ్చిన చూపరులను
జేత మలరించి మిగుల నచ్చెరువు నించి
సారెకును జూత మనిపించు సౌరుమించి
నందుచేతనో చూతమా! యఖిల జనులుఁ
జూత మని పిల్తు రిది మాకుఁ జోద్యమయ్యె.
కోమల శ్యామలంబులై కొమరు మిగిలి

కలిత తరుణారుణంబైన కాంతి గలిగి
లలిత గతినొప్పు పల్లవంబులఁ జెలంగి
సొగసైన బాగులైన యశోకపత్ర
శోభ మఱపించు దళముల సొంపు మెఱసి
సరస సౌరభ సుమరస సహితమగుచు
ఘన మధువ్రత సంగీత కలన నడరి
హృదయ మలరించు పూతచే నింపుమీఱి
చూడఁ దగిన శలాటువుల్ సురుచిరంపు
ఫలములును వ్రేలు నీగోము భవ్యతరము.
మనసు నలరించు శృంగార వనములందు
మేటి తరుజాతి గల మంచి తోటలందు
నీవు లేకున్న మోదంబు నిండఁబోదు.
జాను మీఱెడు ఫలవృక్ష జాతియందు
నీవె నాయక మణి గాగ నెగడు చుందు.
నవ్వురుఁగులికెడు నీడు లేఁజివురుఁదనివి
ననక కుత్తుక బంటిగాఁ దినకయున్నఁ
గరము నెలుఁగెత్తి పంచమ స్వరముతోడ
హాయి మీఱఁగఁ గిన్నెరల్ మ్రోయు నట్లు
కోయిల కొలంబు గానంబు సేయఁ గలదె?

పండుగులలోన మిన్నయై పరగుచుండి
వేడుకలు గూర్చు నేడాది నాఁడు నరులు
నింబకుసు మాదికముతోడ నీశలాటు
సంతతినిఁ గూడఁజేరిచి సంతసమున
మెఱసి భక్షింతు రా రోగ్యకరమటంచు
నే శుభంబెవ్వ రెక్కడ నెపుడు చేయఁ
దలఁచు కొన్నను నీదు పత్రములు లేక
బుధులు ప్రారంభమును జేయఁబోరు. సతులు
వ్రతము లొనరించు నెడ నీదు పత్రములనె
తోరముగఁ గూర్చి తాల్తురు తోరముగను
మంత్రము లవెన్నియున్నను మహిమ గలుగు
నీ దళంబుల సంగతి నాదు కొనక
జీవనములు పావనములు కావటంచు
ద్విజులు పుణ్యాహవాచన వేళలందు
ని న్నపేక్షించు చుండుట నిక్కము కద!
కుముద, కల్హార, కమలాది కుసుమజాతు
లెన్నియున్నను బచ్చనై వన్నెఁదనరు
నీదు చిరుకొమ్మలుండక రాదు శోభ
చారు శృంగార వరగృహ ద్వారములను

ప్రేలు తోరణములకు రసాల రాజ !
అడరు బీరెండ లోపల నడచి నడచి
బడలి వడదాకి కడు సోలి వాలి తూలి
నిన్నుఁ గన్నంతనె ముదమ్ము నిండు కొనఁగ
నాసమొయి నీదు సన్నిధి కరుగు దెంచి
విశ్రమించెదు పాంథుల కశ్రమమునఁ
జిరుత వాయువులను దెచ్చి చెమటలార్చి
చల్లఁ దనమిచ్చి సుఖమిచ్చి సత్వమిచ్చి
కౌతుకము నిచ్చి బుద్ధి వికాసమిచ్చి
యతిథి కభ్యాగతికి మరియాద వెలయ
నాదరముఁ జూపు మంచి గృహస్థుఁ బోలెఁ
జెలిమి తళుకొత్త నుపచరించెదవు గాదె ?
అహహ ! నీసహకారత సార్థకంబు !
నిన్ను జేరంగ వచ్చెడు పిన్నలకును
బెద్దలకుఁ గూడఁ దద్దయుఁ బ్రీతితోడఁ
గనక కాంతుల్లు వెదఁజల్లఁగలిగి మిగులఁ
బచ్చనై ఘుమ ఘుమ మని పరిమళించు
మధుర ఫలముల నొసఁగుచు మదికి ముదము
గొల్పుదువు గాదె నీదగు పొల్పునెల్లఁ

జూచియే కాదె నిత్యంబు శుకములెల్ల
నీ ఫలంబులు బొజ్జలునిండ మెక్కి
కలికి కలకండ పలుకులఁ గప్పు రంపుఁ
బలుకులనుజిల్కు పలుకులు పలుకుచుండి
చెవులకును నిండు పండువుఁజేయు చుండు.
నీ వనేకాకృతులు గల్గి నిరుపమాన
రుచులచే నొప్పు గులుకుదు రుచిర కీర్తిఁ
దాల్చి తరు జాతిలోఁ జాలఁదనరుచుందు
బంభరంబులు కొన్ని నీ పండ్లయందు
గర్భములలోనఁ బుట్టి చక్కఁగను వృద్ధి
జెందుచుండుటఁ గంటి మీ చిత్ర మేమొ
నీకె తెలియంగవలె నిది నిక్కవంబు.
నీవు పుట్టినదాదిగా నీడ నిచ్చి
జంతు కోటికి సౌఖ్యంబు సంతరించి
నట్టి నీ పుణ్యము ఫలించెనా యనంగ
నిలువునను బండియున్న నీచ్ఛెలువు దనరు
చివురులును నాకులును శలాటువులుఁ బండ్లఁ
గొనకు ప్రమానును గూడ లోకులకు నిచ్చు
ప్రతి ఫలాపేక్ష లేని నీ వితరణంబు

సకల జనులకు మార్గదర్శకము గాదె ?
భూజ రాజమ! ఏదేశమునకు లేని
భాగ్యమును సోయగమును మాభరత ఖండ
మునకుఁ గూరిచి నీజన్మమున నఖండ
భోగ మానందమును గూర్చి పొల్తుకాదె ?
లలిత మా కందమా! నీవిలాస లక్ష్మి
సుకవి జనవర్ణ్ణ నీయంబు సుందరంబు
ధరణి జనులకు నెల్ల నీ దర్శనంబు
నేత్ర పర్వంబు, హర్ష సందీపకంబు,
పావన కరంబుఁ బరమ శుభావహంబు
నీ మహాత్వంబు విబుధైక నిగదితంబు
దశ దిశలయందు నీచారు ధవళ కీర్తి
తనరుఁ గావుత మా చంద్ర తారకముగ!

---

## ఇందిందిరము.

కం॥ సిరితోఁ గలసి మెలసి యన
వరతము విహరింతు వనజవన వీథులయం
దిరవుగ నెలకొని యుందిం
దిర మనఁగా నెగడుదును సుధీతతి వొగడన్.

గీ॥ సానపట్టక నిగనిగరాని యింద్ర
నీల మాణిక్య శకలాల లీల డీలు
పఱుపఁగాఁ జాలు డాలునఁబరగు గరుల
నలరుటను గాదె? నను భృంగమండ్రు బుధులు.

కం॥ పరులన్న నేవగించెదు
వర పద్మను లే ప్రసన్న భావమునన్ న
న్నరయుదురు మధురసంబుల
నరమర లేకిచ్చుచుందు రాతిథ్యముగన్.

గీ॥ స్నిగ్ధశీతల సౌరభ ముగ్ధుఁడగుచు
గంధ వహుఁడల్లనను వీవ బంధురముగఁ
దమ్మి మిద్దెల నివసించి సమ్మదమున
గానమును బాడి యానంద కందమగుదును.

క॥ నిలయంబు జలజ విపినము,
మెలఁగుట శ్రీ దేవితోడ, మేలాహారం
బలరుల తేనియ, విద్దియు
కలగానంబిట్టి భాగ్య గరిమయుఁ గలదే?

గీ॥ ఉలివలెను చేపఁ దొలిచెడ
నలరులు కసి గందకుండ నానెదఁదేనెల్
చెలఁగుచుఁ గఠినతయును బే
శలతయుఁ బచరించుచుందు సహజ చతురతన్.

గీ॥ తీయనగువిల్లు, మృదుపుష్పసాయకములు
దనరు సుకుమారుఁడైన మారునకు నారి
నగుచు సహకారినై విజయంబుఁగూర్తు
త్రిజగముల నీడులేని సత్కీర్తిఁ దెత్తు.

క॥ నరులకు సురలకును నలం
కరణార్హంబగుచు గరిమఁగనియెదు నలక్రొ
వ్విరుల కలంకారమునై
కరమలరుదు నళియనంగఖ్యాతి వహింతున్.

క॥ సరసీరుహనేత్రల కచ
భరరుచి, కనుదోయిచెలువు వర్ణించు కవీ

శ్వరులకు మత్కులమే గద !
శరణము హరినీలరత్న సంతానముతోన్.

గీ॥ గగనచరుఁ డౌట ఖేచరుం డగుదు నేను
గాయకుఁడ నౌట గంధర్వకాంతుఁడగుదు
కీటముల మార్చి జాలికాగ్రిముడనగుదు
చిత్రమిది నాదు ప్రజ్ఞావిశేష మహిమ.

ఆ॥ జాతిలోని కప్పురీతిని మాకంద
ఫలములందుఁ బుట్టి లలినిఁ బెఱిగి
జనుల కెల్ల నక్కజముఁగొల్పు ఘనశక్తి
కలదె ! భ్రమరములకుఁగా కొరులకు.

క॥ నిలువు నను బూచి తరువులు
నలువుగఁ గందోయి విందొనర్చెడు నాయా
నెలవుల నెల్లను గులుకుచు
వెలయన్ విహరింతుఁగోనవివశుఁడనగుచున్.

గీ॥ అబ్జమకరంద మాధుర్య మానియాని
కుముద కుసుమ మరందంబుఁ గ్రోలిక్రోలి
మావిపూవుల తేనెలు త్రావిత్రావి
యఖిల పుష్పరసంబుల నాస్వదింతు.

క॥ కేళీ వనములయందును
గేళీ వాపికలఁ దుంగగిరి శిఖరములన్
గేళీ సరోవరంబుల
బాళిన్ విహరింతుఁ బ్రసవపాళిన్ హాళిన్.

గీ॥ ఎవ్వరికిఁ గష్టమనిపింప కిల్లునిల్లుఁ
దిరిగి భిక్షాశనముఁదినువెరవు మమ్ముఁ
జూచియే కాదె విద్యార్థులాచికొనుట
చాలదే! యీసుకీర్తి మాజాతికెల్ల.

గీ॥ చంపకము వంటి పుష్పరాజంబుఁగూడ
మాకటాక్షంబుఁ గోరి నీమమ్ముఁబూని
వర్షవాతాతపములోర్చి వనములోనఁ
జిరతపంబుంట మత్కీర్తి చిహ్నముకద!



## * కోకిల.

### గీతము.

నవనవ్యోపవనంబను నాటకమున
ద్రష్టవగు కోకిలా! స్వాగతంబు నీకు.
శ్రీయెలర్పు వసంతుని రాయబారి
వైన పైకమ! నీకు శుభావహంబు.
ఆదరము తోడ నీకు సుఖాసనంబుఁ
జక్కఁజేయుచు నున్నాఁడు చైత్రుఁ డిపుడు
కౌతుకము తోడ స్వాగత గీతములను
బాడుచున్నవి శృంగారవనము లెల్ల.
అందమును జిందు మాకంద బృంద మెపుడు
కెంజిగురు గమి తోడ రాగిల్లు చుండు
నపుడె మేమెల్లరము నీయథార్థమైన
సుస్వరసుధారసముఁ గ్రోలి చొక్కఁగలము.
పుడమిపై నీకు దారిఁ జూపునటకుఁగాని
తిరుగు వత్సరమందు గుర్తిడఁగఁ గాని
నింగి నక్షత్ర మెదియైన నీకుఁ గలదా?

---

* లోగన్ కవి "కోకిల" ననుసరించి వ్రాయఁబడినది.

అతులితానందరస మగ్నమైన మనసు
గలిగిచెలఁగెడునట్టి ప్రేమికుఁడ వైన
పులుఁగ! నీపాటతోఁ బాటు పుష్పసమయ
మునకు స్వాగత మిడెదము ముదము బొదలఁ
బూవుఁ బొదరిండ్లలోపలఁ బులుఁగుగముల
మధుర గానంబు వినుచుఁ ధన్యుఁడ నగుదు.
భజికి బోవుచు నుండెడు బాలకుండు
విరులఁ గోయుంగఁ దోటలోఁ దిరుగుచుండి
నవ్యమైన వసంతగానమును గ్రోలి
కరము మదినిఁ జలించు నాకస్మికముగఁ
దనివి తీరక నీపాట ననుసరించు.
ఇతర దేశములందు నేఁటేఁట వచ్చి
యరుగు దెంచుచు నుండెడు నతిథి వగుచు
మఱియొక వసంతమునకుఁ బ్రేమంబుతోడ
స్వాగత మొసంగ సమ్మద స్వాంతమునను
నేబుతువు నందు నెల మావు లింపు నింప
నేఁచి కడుఁ బూఁచ వాసించి యెలమి నించు
నాబుతువు నందుఁ గలనాద మలరలోయ
లందు నెగురుచు ముద మొందు చుందు వీవు.

ఎప్పుడెచ్చోటను వసంతుఁ డొప్పుచుండు
నప్పుడెల్లను నచట నీవలరుచుండి
పుష్ప ఫలముఁ గలంబార భూరి వాగునుఁ
జెలువలర నీవునుం బ్రకాశించుచుండు.
నిఖిల జనులకుఁ గడుఁగూర్పు నీడజంబ!
నిత్యమును బచ్చగా నుండు నీగృహంబు
నిర్మలంబుగ నుండు నీనింగి యెపుడు
రహి జనించెడు నీ గాన రసము నందు
దుఃఖ రస మించు కేనియుఁ దోఁచఁబోదు.
రమ్యతరమైన నీవత్సరమ్మునందు
మమ్ము వడకించు శీతకాలమ్ము లేదు.
ఓహో! హాహా! పక్షిరాజమా! యురుతరగతి
నేను నెగురంగఁ గలుగుదు నేని నిన్నుఁ
గూడి యెగురుదు గద! కడు వేడ్క కలర.
తోషదాయకమగు నెక్కడోయి తోడ
మాధవుని స్నేహితుఁడనుగా మలయుచుండి
భూమి చక్రంబుచుట్టును బొల్పుగ మన
వార్షిక ప్రయాణమును జేసి హర్షినగుదు.



## మలయజము.

గీ॥ సహజకాఠిన్యశైలంబు జన్మభూమి
కొలము స్నేహమెఱుంగని కొయ్యజాతి
పరమ మిత్రము లతిక్రూర పన్నగములు
శీలుఁడవు నీవు మలయజా ! చిత్రముకద !

గీ॥ జనని గర్భంబు వెడలి నక్షణము మొదలు
సౌరభము నెల్లెడల వెదఁజల్లు చుంటి ;
పూవుపుట్టిన తోడనే తావి యవి
తెలియు నను పల్కు నిజముయ్యె మలయజంబ !

గీ॥ మలయగిరి నెన్నిపుట్టవు భూరుహములు
వాని పుట్టుకలకు నానవాలుఁ గలదె !
దశదిశలఁ దేజరిల్లె నీవిశదయశము
జన్మమన్నను నీదె శ్రీచందనంబ !

గీ॥ గంధవాహకుఁడును సదాగతియునైన
మారుతుండును గూడ నీమైత్రికతన
మంచిపేరును దాలిచి మలయుచుండె
సాధు సాంగత్యఫలమిదే చందనంబ !

ఆ॥ మలయజంబు మలయ మారుతమునుపేర్లఁ
బరగు నిన్నుఁ బట్టి పవను బట్టి
మలయగిరి ధరిత్రి విలసిల్లెఁ గులదీప
కులుగదా ! సుపుత్రకులు మలయజ !

గీ॥ అనుటయేకాని యనిలున కబ్బినట్టి
నిత్యకీర్తికి మూలంబు నీవెకావె
శ్లాఘ్యుఁడవు నీవాకండవే సర్వగతుల
భూజనులకెల్ల శ్రీఖండ ! భూజరాజ !

క॥ నీవలెను మాతృభూమికిఁ
బావనకీర్తిని ఘటించి భాసిల్లినదే
యేవృక్ష రాజమైనను ;
భూవలయమునందిసు గంధ భూజ లలామా !

గీ॥ చలువఁ దనమున, బహుసువాసనలవలన
నఖిలజన మానసాహ్లాద మాచరించి
సరస గుణభాగ్య తనుజేసి చంద్రనాఖ్య
నలరుచుంటివి గాదెయో మలయజంబ !

గీ॥ నిన్ను ఖండించు వారికి నిప్పునందు
వైచి దహియించువారి కవ్వారిగాగ

సౌరభములిచ్చి తన్పెదవౌర ! నీదు
సద్గుణముశ్లాఘనీయంబు చందనంబ !

క॥ నరులకు నపకృతి చేసెడు
నరులకు నుపకృతియె చేయుఁడని తెల్పుటయో?
పరిమళ మిచ్చెద వరరే !
యరుగం దీసినకొలంది హరిచందన మా !

గీ॥ నందనము నీకుఁబుట్టిన మందిరంబు
సౌరతరు పంచకములోనఁ జేరి తీవు
బుధ జనా రాధ్య తను సదా బొల్తువీవు
గుణము త్యాగంబు కలదె నీ కొలఁది ద్రుమము?

క॥ ఘనతరులు నిన్నుఁ గనుఁగొని
ఘనతరగుణ మభ్యసింప గావలయును భూ
మిని బుట్టినందులకు నిటు
జననుతిఁ బడయంగ వలయుఁజందన ద్రుమమా!

సీ॥ పామరులుఁ భండితులు నృపగ్రామణులును
నిన్ను నక్కునఁజేర్చి మన్నించుచుండఁ
జెంచు లింధనములు గాఁగఁ జేతురకట !
“ అతి పరిచయాదవజ్ఞత ” యనరె ! బుధులు

గీ॥ మూలము భుజంగములఁ కగ్రమును విహంగ
ములకు నీడను సారంగ ముఖ్యములకు,
నంగమెల్లను నరలోక పుంగవులకు
దాన మిడుమేటిదాత ! గంధద్రుమంబ !



## అగస్త్యభ్రాత.

### గీతము.

భరత వర్షంబు నుద్ధరింపఁగ జనించి
మించు ఋషికుల మందున మేటియగుచు
నవతరించెను సార్థకాహ్వయము గాఁగ
నుత్తముండను నొక యుత్తమోత్తముండు.
వేద వేదాంగ సార సంవేదియతఁడు
వివిధ శాస్త్ర రహస్య కోవిదుఁడతండు
పృథు తపోయోగ నిష్ఠా గరిష్ఠుఁ డతఁడు
ధృతి జితేంద్రియలోక వరిష్ఠుఁ డతఁడు.
వింధ్యగర్వంబు సర్వంబు వంధ్యపఱచి
చెనఁటి యిల్వల వాతాపులను వధించి

కడలి జలముల నెల్లను బుడిసిలించి
ఖ్యాతిఁ గన్న యగస్త్యుని భ్రాత యతఁడు.
అత్తఱిసి యొద్ద లేని మహత్తులేదు
ఆతని కసాధ్యమైన కార్యంబులేదు
అతఁడెఱుంగని దోక రహస్యంబులేదు,
అతఁడుచేసిన మేలు సుంతైన లేదు.
శృంగభంగంబొ ఖలులకుఁ జేయలేదు.
దుష్టరాక్షస వర్గంబు దునుమలేదు.
జడమతుల పొంగుపాల్లు నడఁప లేదు.
శాస్త్రరచనను నుపకృతి సలుప లేదు.
జగతికే యుపకారంబుఁ జలుపకునికి
స్వీయ శక్తిఁ బ్రకాశింపఁ జేయకునికి
లోకవిషయంబు పొంతలఁ బోకయునికి
నుత్తమ మునీంద్రు నెఱుఁగరీ యుర్విజనులు.
అందు మూలంబునను నతం డెందుఁ జనిన
నాతఁడెవరని యెవ్వరైన నడిగిరేని
వానిపేరు ప్రసిద్ధంబు కాని కతన
ప్రజలు పేర్కొనిరి యగస్త్యభ్రాతయనుచు.
అఖిలమునకు నగస్త్యుని యంతవాఁడు

నిఖిల మునులకు వంద్యుఁడై నెగడు వాఁడు
దశదిశల సద్యశము నింపఁదగిన వాఁడు
ఊరుఁ బేరును లేకుండ నొఱిగి నాఁడు.
ఎంతఘనుఁడైన దనవల్ల నింతయైన
లోకమున కుపకారంబు లేకయున్న
జనుఁ డనామకుఁ డగుట నిస్సంశయంబు
ఉత్తముఁ డనామ తరువయి యున్నయట్లు.--
ఆంధ్రదేశీయులార ! గుణాఢ్యులార !
ఘనులు మీలో ననేకులు గలరు గాని
రూఢిగ నగస్త్యులయ్యెదరో ? యగస్త్య
భ్రాతలగుదురో ? యద్ది మీచేతఁ గలదు.



దోమ.

గీ॥ సారె నాయంత వారలు లేరటంచు
నెగసి పడియెద వెందుకే? నీచజన్మ!
ఏనుఁగాదువె! నీవు పాల్లెన్ని పడిన
తొండ మున్నంత మాత్రాన దోమకూన!

క॥ జవ సత్వమూ లున్న వె యా
హవములలో ఘనశతఘ్నికాదుల నెల్లన్
దవిలి వహింతువె! కరితో
నవమతి! నీకెట్టి సామ్య మరయవె! దోమా!

క॥ భటులకు వాహంబై యా
ర్భటితో ఘీంకృతులు సెలఁగఁ బ్రతివీరమహా
పటలములఁ ద్రుంపఁ గలవే
పటుగతిఁ గరహతుల బహుళపద ఘట్టనలన్.

గీ॥ నెలతలకు మందయానంబు నేర్పఁగలవె?
దాన ధారల నలులను దనుపఁ గలవె?
పొసఁగు మౌక్తిక దంతంబు లొసఁగఁ గలవా?
సామజమునకు నీకేటి సాటి? చెప్పుమ!

గీ॥ డేగతో నీడువచ్చునే ! యీగ కూన
బెబ్బులికి సాటి వచ్చునే ! పిల్లి కూన
హస్తి మశకాంతరం బనుటైన వినవె !
యుద్ధియే నీకు గజమున కోసి దోమ !

క॥ ఆరాజ్య పూజ్యతయు నా
గౌరవ మాభోగ మా యఖండానందం
బీడేడు తనువు లెత్తిన
నేరితినినైనఁ గాంతువే ! మశకంబా !

క॥ లోకుల కేలాభంబును
లేకున్నను గీడు కలడులే నీకతనన్
నీకాటువలన జ్వరములు
చేకురు నీజన్మమేమి ? సీ ! సీ ! దోమా !

క॥ పోడిమిగా సంగీతముఁ
బాడెదు గతి చెప్పలచెంతఁ బాటుస్వరములన్
బాడెదవు నిద్రఁ జెఱుపుచుఁ
గూడునె ! యీలాటి నీచగుణములు దోమా

క॥ చిరుమేని దానవైనను
నరులకు నీకతన యాతన ఘనంబెనుమీ !

పరికింప గొప్ప గృహముల
నెరుసే దహియింపదే క్షణికమున దోమా!

క॥ రవ్వంత గాలి వీచిన
మవ్వము చెడి నిలువలే కమాంతముగఁ గడున్
దవ్వునఁ బడెదవు నీకీ
క్రొవ్వేటికె? నరులఁబట్టి కుట్టెదు దోమా!

క॥ నల్లివలె నలుపఁ బోవఁగ
నల్లన నెగసెదవు కుట్టినంతనె నిన్నున్
బల్లిదినను! నీ యిల్లా
కొల్లేరై పోను! మేమి గుణమిది? దోమా!

క॥ రక్తంబుఁ ద్రావి బ్రదుకుట
నక్తంచరకోటికెల్ల నైజము నీకున్
యుక్తము గాదిది మానుము
వ్యక్తి గలిగి సంచరించుమా! మశకమ్మా!

క॥ పొగరెక్కి సర్ఘులఁ దెలియక
పగఁగొని హింసింపఁ బోవు పలుమరు నిన్నున్
బొగఁబెట్టి చంపనేర్తురు
తగ దింతటి దుడుకుఁదనము తక్కరి దోమా!

క॥ దూతలు చఱపులటంచును
జేతులఁ దట్టుచును విసువుచేతను నిన్నుకా
బూతులు దిట్టుచు రోతురు
రాతురులను మనుజులెల్ల రక్కసి దోమా!

క॥ ధనికులు దోమతెరల వ
ల్లను బీదలు గడ్డి తొంటల కతంబున నీ
పెను బాధఁబాపి కొనుచుం
దినముల నొకరీతిఁబుచ్చి తేఱరె దోమా!

క॥ జలదారులు పశువుల సా
లలు నతి దుర్గంధయుత జల స్థలములు నీ
కులమునకు జన్మభూములు
వెలయుఁగ నపవిత్రురాలవే ఛీ! దోమా!

క॥ హింస మహాపాపం బని
హింసింపరు శత్రుకోటి నేనియుఁ దజ్ఞుల్
హింసించెద విటు సాధుల
ధ్వంసంబగుఁ జుమ్మి ఖలులవంశము దోమా!

క॥ సాధు లుసురుమని తిట్టినఁ
బోదూరక యగ్నివోలెఁ బొలియించు మహా

క్షేమంబు సంభవించును
రాదు సుఖము తెలిసి బ్రదుకరాదే! దోమా!

క॥ కొల్లేరు నీరుం బుట్టిన
యిల్లచ్చటి కేగు మెన్నఁడిటు రాకుము! నీ
పొల్లచటం బోసి కొమ్మా!
యల్లరి నీకేల? బ్రదుకుమా! నెమ్మదిగన్.

---

## * స్వాతంత్ర్యము.

### మంజరీ ద్విపద.

ధైర్యశాలురును స్వాతంత్ర్య తత్పరులు
సాహసికులునైన సజ్జనోత్తముల
వంశంబుల జనించి వఱలెడు వార
మని దంభమడరంగ నతి గర్వమునను
మత్తులై చరియించు మానవులార!
ఎందైన బానిసీండ్రే యుండెనేని
సాహసులే? మీరు స్వచ్ఛంద పరులె?
వాస్తవంబుగ మాకు వచియింపరయ్య!
మీకు సోదరులుగా మెలంగెడు నట్టి

---

* "లవెల్" అనువాని స్వతంత్రత కనువాదము.

వారి శృంఖలములు వదలింపరేని
వారి కష్టములకై వల పోయరేని
నిజముగా మీరు బానిసవాండ్రు గారె ?
అమల స్వతంత్ర తార్వాతఁ గాంచలేని
పరమ వినీచులౌ బానిసల్గారె ?
స్వార్థంబు పొంటెను బంధనంబులను
సడలించు కొనుటయుఁ జర్మ భస్త్రికల
వంటి కాదమూత్రోడఁ బ్రజలకు నెల్లఁ
బటుతరంబగు నప్పు పడియుంటి మనుచుఁ
దలపకుండుటయు స్వాతంత్ర్యమే యగునె ?
కాదు ! ము మ్మాటికిఁ గాదది కాదు !
మన సోదరుల నెల్ల మఱుగంగఁ జేయు
నిడుములు మనము భాగించుకొంటయును
జేతనైన కొలందిఁ జేతులతోను
గృపజిల్కు నిర్మల హృదయంబుతోను
బరుల స్వాతంత్ర్య లాభప్రాప్తిఁ గోరి
యుత్సాహమును జూపుచుంటయే స్వేచ్ఛ !
అదియె స్వచ్ఛంబుగా నలరారు స్వేచ్ఛ !
అదె మానధనులు నిత్యముఁగోరు స్వేచ్ఛ !

ఎవ రధోగతినున్న హీన మానవుల
పక్షంబు, దుర్బల ప్రజల పక్షంబు
వహించి వాదింప భయము జెందుదురో
యా మానవులె నీచులగు బానిసీలు !
ఎవరు స్వధర్మమై యొసంగెడు నట్టి
సత్యమార్గము నుండి జడత చెందొందక
దొలంగుట కంటె మర్త్యుల యపహాస్యతయు
నాక్షేపణములును నపనిందనములు
నధికంబుగా నెంచి యభిలాష పడరో !
ఆ నరులే హీనులగు బానిసీలు !
ఎవరు ముగ్వురిఁ గాని యిర్వురిం గాని
కలసి న్యాయములైన కార్యంబులందు
వర్తింప వెఱతురో వారె బానిసలు !



# మంగిపూడి వేంకటశర్మగారి గ్రంథములు.

## నాటకములు.

### వీరమతి

ఇది చరిత్రాత్మకమై వీరరసభరితమై కరుణారస పూరితమైన యేడంకముల చక్కని నాటకము. ఇందు రాజపుత్ర స్త్రీరత్నములకు సహజములగు దేశభక్తి, స్త్రీసాహసము, స్వార్థత్యాగము నత్యద్భుతముగా ప్రదర్శింపఁబడినవి. భారతీయు లెల్లరును పఠింపఁదగినది. వెల రూ. 0-10-0

### పుష్పవేణి

ఇది కరుణ రసప్రధానమై యద్భుతకథావిలసితమై నవరసభరితమైన యాఱంకములమంచి నాటకము. ఇందు భారతీయ నారీతిలకములకు సహజమైన పాతి వ్రత్య మత్యాశ్చర్యకరముగా ప్రదర్శింపఁబడినది.

ఇందు కన్యాశుల్క, వరశుల్క, బాల్యవివాహ, వృద్ధవివాహ, విషమవివాహాది సంఘసంస్కరణ విషయములు సరసముగా వర్ణింపఁబడినవి. వేయేల? ఈనాటకము నీతులకు నిధానము. ఇందలి దొంగల పాటలును, పద్యములును, సంభాషణములును కడుపుచెక్కలగునట్లు నవ్వుపుట్టించును. ఎల్లవారును చదివి తీరవలయును. రూ. 0 - 0 - 0

## పద్యములు.

### బాలవితంతువిలాపము.

జాలిపుట్టించు పద్యములు. ఒక్కపద్యము విన్నఁ జాలును. వజ్రమువంటి హృదయమైనను వెన్నవలె కరిగిపోవును. శైలిసులభమై మనోహరమై ద్రాక్షామధురమై యెంతచదివిన తనివితీరదు.

రూ. 0 - 4 - 0

# స్త్రీ ధర్మ బోధిని.

## భరత మాతృశతకము.

భక్తిరసభరితము. దేశభక్తులందఱును జదివి ప్రతిబాలుని చేతను, ప్రతిబాలిక చేతను జదివింపవలసినది. ఇంటింట నుండదగినది. వెల. రూ. 0-1-6

# వచనములు.

## రాజలేఖ.

స్త్రీలకు సంగీతము లేని లోపములను దెలుపు నీతి బోధకమగు నిజమైనకథ. ఇందు వేశ్యలనుగూర్చిన హృద్యములగు పద్యములును గలవు. పెద్దయక్షరములతో రెండవమారు ముద్దుగా ముద్రింపఁబడినది. వెల. రూ. 0-3-0

## లలిత.

ఇదియును నిజమైన నీతికథయే. అసమాన వివాహమువలన సంభవించిన యనర్థమిందు చక్కఁగా

వర్ణింపఁ బడినది. శైలి లలితమై పేరుకుతగినట్లు న్నది. పెద్దయక్షరములతో నందముగా నచ్చొత్తింపఁబడినది. వెల. రూ. 0 - 3 - 0

## ద్రౌపది.

సుప్రసిద్ధురాలగు నీమహాపతివ్రత చరిత్రము విపులముగా తేటమాటలతో వ్రాయఁబడినది.
వెల. రూ. 0 - 3 - 0

## సీత.

త్రిజగత్పూజ్యురాలగు నీ సతీరత్నము పవిత్ర చరిత్ర మతిరసవంతముగా సులభశైలిని రచియింపఁ బడినది. వెల. రూ. 0 - 3 - 0

చిరునామా:—

**మంగిపూడి-వేంకటశర్మగారు**

పిప్పర,

**పెంటపాడు పోస్టు**

కృష్ణజిల్లా,